నిజాం సంస్థానంలో సత్యాగ్రహ ఉద్యమం

2-వ పేజి

# ఆంధ్రపత్రిక

రాష్ట్రంలో ధాన్య సేకరణ

6-వ పేజీ

316907

The Andhra Patrika, Madras, } Regd No. 1118, Vol. 34 No 136 TUESDAY 9th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# మైసూరులో బాధ్యతాయుతప్రభుత్వంఏర్పడగలదని మహారాజాహామీ

## ఢిల్లీఅశాంతిని పుటకలోనే హతమార్చాలి

### అసామాన్య నైతికవర్తన చూపాలని ఉద్యోగులకు పటేల్ విజ్ఞప్తి

### కల్లోలిత ప్రాంతాల్లో నెహ్రూ, బలదేవ్ సింగుల పర్యటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: "ఢిల్లీలో శాంతిభద్రతలకు తిరిగి ప్రచండ ప్రమాదం సంభవించే అవకాశం కనిపిస్తోంది. పూర్వం పోలీసు దళాలూ, సివిలు ఉద్యోగులూకూడా మిక్కిలి శక్తిసామర్థ్యాలతో పూర్తి నిష్పక్షపాతంతో ఏమాత్రం మతకలహం పొడచూపినా వెంటనే అణచివేశారు. భారతాధినివేశ ప్రధాననగరంలో సత్వరంగా శాంతిభద్రతలు నెలకొల్పేందుకు సివిలు మిలిటరీ ఉద్యోగుల్లో ప్రతి ఒక్కరూ తమ సర్వశక్తులూ ఉపయోగించి కృషి చెయ్యాలని విజ్ఞప్తి చేస్తున్నాను" అని భారత ప్రభుత్వ దేశీయశాఖా మాత్యులు సర్దార్ వల్లభాయ్ పటేల్ నేడొక విజ్ఞప్తి ప్రకటించారు.

ఆయన ఇంకా ఇల్లా అన్నారు.

"ఈ మతకలహ పిశాచాన్ని పుటకలోనే హతమార్చాలంటే బాధ్యతగల ప్రతివారూ అసామాన్య నైతికవర్తనతో జాతిమత పక్షపాతరహితులై ప్రజాసేవ చెయ్యాలి. ఏమాత్రం పక్షపాతం కనిపించినా దానివల్ల అనేక దుష్ఫలితాలు రావడమే కాక, సైన్యమున్నూ స్థిరంగా పోరుకు పోతుంది. ఈ పరిస్థితులలో ఏమాత్రం అశ్రద్ధనూ సహించడానికి వీలులేదు.

"దేనికొరకు అంటున్నానంటే పూర్వం అంత మహోన్నతంగా కృషిచేసిన మీరు ఇప్పుడు బద్ధకిస్తారని కాదుగాని, ఈనాడు మన మధ్యకు ఎక్కడనుంచో వచ్చిపడ్డ మత విద్వేషదవానలాన్ని అతిక్రమించి మన మందరమూ ఇతోధిక ధృఢనిశ్చయంతో పటుతర శ్రద్ధాభక్తులతో కృషిచెయ్యాలని చెప్పడమే నా ఉద్దేశం.

#### ప్రజలు: కాందిశీకులు

పంజాబ్ బాధితులయెడల సానుభూతితో కొందరు ఉద్రేకంపొంది ఢిల్లీ ప్రశాంతిని పాడుచెయ్యడంవల్ల అటు పంజాబ్ ప్రజలకు సహాయం చెయ్యలేకపోగా, చేస్తున్న భారతప్రభుత్వాన్ని నిరుత్సాహపరచినట్లవుతుందనీ అందుచేత శాంతిమనస్కులై ప్రవర్తించడమే సర్వాత్మనా శ్రేయస్కరమనీ ఢిల్లీ ప్రజలకీసందర్భంలో విజ్ఞప్తి చేస్తున్నాను.

ఎన్నోకష్టాలు పడుతున్నారన్న జాలితో కాందిశీకులకు మేము సౌకర్యాలు కల్పిస్తూ ఉంటే వారిలో కొందరు అక్కడి విద్వేషాలను ఇక్కడకూడా వ్యాప్తిచేస్తున్నారు. ఇలా చెయ్యడంవల్ల వారు మేమిచ్చిన ఆతిథ్యాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. వారుకూడా సత్పౌరులుగా ప్రవర్తించాలని కావిస్తున్నాను."

#### ఢిల్లీలో తిరిగి అశాంతి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: ఇవ్వాళ ఢిల్లీలో అశాంతి కన్నాట్ ప్రదేశంవరకూ ప్రాకింది. ఇదివరకు వివిధగా వ్యాపారాలు సాగే చోటు. ఉదయాన్నే కొందరు దుర్మార్గులు మూకలుగా బయలుదేరి దుకాణాలు పగలగొట్టి వస్తువులు దోపిడీచేసి కల్లోలం చెలరేపారు. మిలిటరీవారు వెంటనే వచ్చి దుర్మార్గులను తరిమివేశారు.

(2-వ పేజి చూడుడు)

"లోకశాంతికి పెట్టనికోట మాస్కో"

#### నగర వారికోత్సవ సభకు స్టాలిన్ సందేశం

మాస్కో, సెప్టెంబరు 7: "ప్రపంచములోని శాంతికాముక ప్రజలందరకు మాస్కోను శాంతికిని పెట్టనికోటగా, సామ్రాజ్యతత్త్వమునకు పుట్టినిల్లుగా ప్రశంసించుచుందురు. సుస్థిర శాంతి, సౌభ్రాతృత్వములకు, ప్రపంచ సంగ్రామ నివారణకు శాంతిదూతగా మాస్కో ప్రపంచమునకు మహత్తరసేవ చేసినది" అంటూ, జనరలిస్సిమో స్టాలిన్ మాస్కో 800వ జన్మదినోత్సవ సందర్భమున శుభసందేశం పంపించినాడు.

మధ్యయుగమునుండి పురోగమించిన రష్యా ఐక్యతకు మాస్కోయే కారణమనియూ, సోవియట్ నూతన సామాజిక–ఆర్థిక వ్యవస్థానిర్మాణమునకు మాస్కోయే ప్రోత్సహించినదనియూ, మానవునిపై మానవుని అధికారమును తిరస్కరిస్తూ, పెట్టుబడిదారీ విధానమును రూపుమాపి, కార్మిక రాజ్యమును స్థాపించుటకు మాస్కోయే దోహదము చేసినదనియూ మార్షల్ స్టాలిన్ అన్నాడు.

పీడిత ప్రజానీకము సామ్రాజ్యవాద దాస్యశృంఖలాలనుండి బైటపడుటకు జరుపు పమరచిహ్నమే మాస్కో. సామ్రాజ్యవాదులకు యుద్ధము లాభకరము. ఇంకొక ప్రపంచ సంగ్రామమునకు వారు తయారగుచున్నందుకు ఆశ్చర్యపడనక్కరలేదు. ధనికవాద సామ్రాజ్యవాదములనుండి విముక్తి పొంద సమకట్టుచున్న ప్రజలకు మాస్కోయే ధృవతార అని జనరలిస్సిమో స్టాలిన్ అన్నాడు.

#### గాంధిజీతో నాయకులగోష్ఠి

కలకత్తా, సెప్టెంబరు 7: రాష్ట్రపతి ఆచార్య కృపలానీ, అఖిలభారత కాంగ్రెసు సంఘ కార్యదర్శి శంకరరావుదేవ్, పశ్చిమ బెంగాలు ప్రధాని పి. సి. ఘోషు, బెంగాలు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు సురేంద్ర మోహన్ ఘోషు, నళినీరంజన్ సర్కార్, కుమార్ శాంతిఘోషు గార్లు ఇవ్వాళ మహాత్మా గాంధీని దర్శించారు.



### దుండగీడు చేతిలో కత్తిని నెహ్రూ లాక్కొన్నాడు

#### సంక్షుభిత ప్రాంత పర్యటన విశేషాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: సర్దార్ బలదేవ్ సింగును వెంటబెట్టుకొని సంక్షుభిత ప్రాంతాలలో పర్యటనం చేస్తున్న నెహ్రూ ఈ ఉదయం ఒక దుండగుని చేతిలో వున్న కత్తిని అమాంతం లాక్కొనగలిగాడు. దారినపోతున్న ఒక అమాయక పౌరునిపై ఆ దుండగీడు అత్యాచారం జరపబోగుండగా యీ సంఘటన జరిగింది. కత్తిని తీసివేసుకొని, నెహ్రూ ఆదుండగీడుని గద్దించాడు, ఆ పరిసరాలలో వున్న గూండాలందరూ ఈ వర్తమానం విని పారిపోయినారు.

కొన్ని దుకాణాలను లూటీ చేయడానికి ప్రయత్నిస్తున్న ఒక సమూహాన్నికూడా నెహ్రూ గద్దించి బెదరగొట్టివేశాడు. కొంతమంది లూటీదార్లను భారత ప్రధాని నెహ్రూ స్వయంగా పట్టుకొని పోలీసులకు అప్పగించాడు. నెహ్రూరాక అమోఘంగా పనిచేసి ఆ ప్రాంతంలో శాంతిని నెలకొల్పింది. (యు. ప్రె.)

#### గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌పై దాడి

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 7: ఈ సుభ్యాహ్నం ఢిల్లీ నుంచి బయలుదేరిన గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ రైలుబండిపై న్యూఢిల్లీ స్టేషనుకు రెండుమైళ్ళ దూరాన కొందరు దుండగీళ్లు దాడి సాగించారు. మిగతా వివరాలేమీ ఇంకా తెలియరాలేదు. (యు. ప్రె.)

## నూత్న రాజ్యాంగం ద్వారా అమలు జరుగుతుందని ప్రకటన

### శాంతిస్థాపనకు ప్రజాసహకారాన్ని అర్థిస్తూ సంస్థానాధీశుని ప్రత్యేక విజ్ఞప్తి

బెంగుళూరు, సెప్టెంబరు 8: మైసూరు సంస్థానంలో నూత్న రాజ్యాంగంద్వారా బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన జరగగలదని మహారాజా సంస్థాన ప్రజానీకానికి హామీ ఇస్తూ నేడొక ప్రత్యేక సందేశాన్ని ప్రకటించాడు. భక్తిశ్రద్ధలు కలిగి ప్రభుత్వంతో సహకరించవలసిందని, సంస్థానంలో శాంతిభద్రతలు ఏర్పడేటట్లు చూడవలసిందనీకూడా సంస్థానాధీశుడు ఈ సందేశంద్వారా ప్రజలకు ప్రత్యేకవిజ్ఞప్తిచేశాడు.

#### బెంగుళూరు పరిస్థితులు

బెంగుళూరు, సెప్టెంబరు 7: బెంగుళూరు కంటోన్మెంటు సెప్పింగ్ రోడ్డులో సమావేశమైన జనసమూహములను అదుపులోనికి తీసుకొని వచ్చుటకు పోలీసులు బాష్పవాయువు నుపయోగింపవలసి వచ్చెను. కంటోన్మెంటు వివిధ భాగములలో ప్రదర్శనలు చాలా ప్రొద్దుపోవువరకు జరిగెను. పోలీసులపైదాడిచేయుటచే ప్రజలు లక్ష్యముగా నుండెను. సెప్పింగ్ రోడ్డులో జనులు సమావేశమై 'డౌన్ విత్ పోలీస్' అని కేకలు వేసిరి. సాయంత్రం 6 గంటలకు జన సమూహములపై పోలీసులు బాష్పవాయువు ప్రయోగించిరి. బాష్పవాయువువల్ల నొచ్చినవారికి, ప్రక్కనున్నవారు ఉల్లిపాయలనిచ్చిరి. బాష్పవాయువుకు యిది మంచి ప్రతిక్రియ అని తలచి వారు దీని నిచ్చిరి. ప్రదర్శన చేసినవారిలో చిన్నపిల్లలు విశేషముగా నుండిరి. 'ప్రదర్శన చేయుటకు నీవెందుకు వచ్చితివి?' అని పదేండ్లపిల్లవానిని ఒక పోలీసు ఆఫీసరు అడుగగా, 'నా దేశమునకు మరెవ్వరు సేవచేసెదరు. సేవకు ఫలితం కలుగకమానదు' అని వెంటనే అతడు సమాధాన మొసంగెను.

100 సత్యాగ్రహులను నేడు పోలీసులు కస్టడీలోనికి తీసికొనిరి. అరెస్టయిన వారిలో స్త్రీలు చాలామంది కలరు. ఒకతె పసిపిల్లతల్లి.

కర్ఫ్యూ అమలుచేసినతరువాత నేడుమై సూరునకాంతముగానుండెను. వారము రోజులుమూయవలసినదని హోటళ్లకు, సినిమాలకు ఉత్తరువు చేసిరి. సంస్థానమునందలి ఇతర భాగములలో సంఘర్షణలు లేవని అధికారుల మూలమున తెలిసినది. అ. ప్రె.

#### యూరప్‌లో రష్యా విధానం

##### జనరల్ డిగాల్ విమర్శ

బామెన్సి, (ఫ్రాన్సు) సెప్టెంబరు 7: "సోవియట్ అనుపమలకోలాహలంచే మూడింట రెండువంతులు యూరప్‌లోని ప్రజలు విడదీయబడి క్రమేణా తమ వ్యక్తిత్వము, తమదేశ స్వాతంత్ర్యము కోల్పోవుచున్నార"ని జనరల్ చార్లెస్ డిగాల్ ఇచ్చట ఒక బ్రహ్మాండమైన బహిరంగ సభలో ఉపన్యసించెను. "తూర్పు మధ్య యూరప్ రాజ్యాలు ఇతర యూరప్ నుండి వీడదీయబడి, ఆ రాజ్యముల సాధన సంపత్తి సోవియట్ రష్యా సౌభాగ్యము కొరకు ఉపయోగింపబడుచున్నది. బ్రిటను దుర్బలమై, ఇటలీ నాశనమై, జర్మనీ అల్లకల్లోలమై పోయిన పశ్చిమ యూరప్ ఫ్రాన్సుకు సహాయపడలేదు. అమెరికా సహాయపడుచున్నది. సహాయపడజాలదు. కాని ఏదో ఇంద్రజాలం జరుగునని మనం ఆశించరాదు. సోవియట్ ఇనుపకోట తాడనచే మూడింట రెండువంతులు యూరప్‌లోని ప్రజలు విడదీయబడి క్రమేణా తమ వ్యక్తిత్వము తమదేశ స్వాతంత్ర్యము కోల్పోవుచున్నారు. ఈ నిరంకుశ విధానము రేపు ఎటుచేయబోవుచున్నదీ ఎవ్వరికి తెలియదు. ఆ మహోపన్యాస నాయకుల ఆశయము లేమో బోధపడుటలేదు. బహుశః వారి ఆశయములు వారికే తెలియకపోవచ్చును. డిక్టేటరులు ఎప్పుడూ తమ విధానమునకు తామే సేవకులై అనుగమించ వలసినదే. కాని మన దేశమునకు గొప్ప ప్రమాదము రానున్నదని మాత్రము స్పష్టమగుచున్నది. మనలో కొందరు ఆనిరంకుశ విధానమునకు దాసులగుటవలన ఈ ప్రమాదం మరింత భయంకరమగుచున్నది. అదృష్టవశాత్తు, పశ్చిమ రాజ్యములలో ఈ నిరంకుశ విధానమును ప్రతిఘటించుటకు అమెరికా పూనుకొన్నది. కాని అమెరికా కూడా కొన్ని తప్పులు చేస్తూనేవున్నది. తమకు కావలసిన పోషణలు ఈ పశ్చిమరాజ్యములు యివ్వలేక పోవుటవలన, పశ్చిమ రాజ్యముల యూనియన్ ను విస్మరించుచూ అమెరికా ప్రవర్తింపవచ్చును. కాబట్టి బలవత్తరము, సర్వసౌభాగ్యశోభిత మగు ఫ్రాన్సును కేంద్రముగా నిడుకొని పశ్చిమ రాజ్యములు సంఘటితము కావలెను. యూరప్‌కు అమెరికా సహాయం సంపాదించుటలో ఫ్రాన్సు అగ్రనాయకత్వము వహించి రష్యాతో, యూరప్‌లో శాంతి, స్వేచ్ఛా సౌభాగ్యములు పెంపొందించి, ఐక్యరాజ్య సమితి సూత్రములు వాస్తవిక మగునట్లు కృషి చేయాలి" అని జనరల్ డిగాల్ ఉపన్యసించెను.

## శాంతిస్థాపనకు భారతప్రభుత్వ అత్యవసర సంఘం

### కాందిశీకులరక్షణకై ఏర్పాట్లు

### గృహదహనాది చర్యలకు మరణదండన విధించాలని నిర్ణయం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: భారత మంత్రి వర్గపు అత్యవసర సంఘం నేటి ఉదయం 11 గంటలప్పుడు 3 గంటల కాలమూ, సాయంత్రం 6 రింటికి మరి రెండు గంటల సేపూ ప్రభుత్వ భవనంలో సమావేశమయి తూర్పు పంజాబుకు వచ్చిన కాందిశీకుల రక్షణ విషయంలో కొన్ని ముఖ్య నిర్ణయాలు చేసినట్లు నేడు వెలువడిన ప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది.

తూర్పు పంజాబు గవర్నరు, ప్రధాని, దేశీయశాఖామాత్యుడు తూర్పు పంజాబు పరిస్థితిని గూర్చి వివరించిన పూర్తి నివేదికను ఈ సంఘం వారు శ్రద్ధగా విన్నారు. ఆ నివేదికలో కాందిశీకుల రాకపోకల వల్ల ఏర్పడిన సమస్యలను అత్యవసరంగా పరిష్కరించాలని వారు ఉద్ఘాటించారు.

2 వ పేజి చూడుడు

### హెచ్. పి. మోడీ

#### బొంబైతాత్కాలిక గవర్నర్‌పదవీస్వీకారం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: ప్రస్తుత ఇండియా ప్రభుత్వమువారవలంబించిన ఇండియా ప్రభుత్వ చట్టమునందలి 48 సెక్షను క్రింద, సర్ జాన్ కాల్విలీగారి సెలవుసమయములో గవర్నరు జనరలు, సర్ హోర్మస్జీ పేరోషా మోడీగారిని బొంబాయి గవర్నరుగా నియమించెనని ప్రభుత్వము వారు ప్రకటించుచున్నారు.

#### ప్రమాణ స్వీకారం

పూనా, సెప్టెంబరు 7: సర్ హెచ్. పి. మోడీగారు నేడు పూనా, గణేశ్ ఖండ్, ప్రభుత్వ భవనములో బొంబాయి గవర్నరుగా ప్రమాణము స్వీకరించిరి. బొంబాయి ప్రధాన న్యాయమూర్తి గౌ॥ చాగ్లాగారు సర్ మోడీగారిచే ప్రమాణము చేయించిరి. ఈ ఉత్సవము నిరాడంబరముగా జరిగెను. బొంబాయి ప్రధాన మంత్రి శ్రీ బి. జి. ఖేర్‌గారు, సర్ మోడీ దంపతులు ప్రమాణస్వీకార సమయమున నుండిరి. (అ. ప్రె.)

### ఇండియాకు ఆహార పదార్థాల అరువు

#### కృష్ణమీనన్ ప్రయత్నాలు

లండన్, సెప్టెంబరు 7: లండన్ నగరములో ఉన్న ఇండియన్ హైకమీషనరు వి. కె. కృష్ణమీనన్ ఇండియా ప్రభుత్వము తరఫున బ్రిటిషు ప్రభుత్వము వారినీ ఇంకా ఇతర ప్రభుత్వాల వారినీ భారత దేశానికి ఆహారపదార్థాలు అప్పు పెడతారేమోనని అడిగినాడు. "ఎవరో ఒకరు ఆహారపదార్థాలను ఇవ్వకపోయేట్లైతే అచిరకాలములో భారతదేశములో 1943 సంవత్సరములో మాదిరిగా మహా క్షామం రవచ్చునని" చెప్పినాడు.

## పాకిస్తాన్ ఆహార పరిస్థితి విషమిస్తున్నదని ప్రభుత్వ ప్రకటన

### వర్గసంక్షోభాలు, వరదలు కారణాలట

కరాచి, సెప్టెంబరు 7: "ఆరంభంలో అనుకొన్నట్లుగా కొదుంబా పాకిస్తాన్ ఆహారపరిస్థితులు తిన్నగా లేనట్లు ఇప్పుడు పర్యాలోకనము చేయగా తెలుసూ ఉంది. అనేక కారణాలవల్ల ఆహార స్థితిగతులు బాగా విషమిస్తున్నవి" అంటూ పాకిస్తాన్ ఆహారశాఖా మంత్రాంగము వారు ఒక ప్రకటనము చేసినారు. ఆ ప్రకటనలోని ముఖ్యాంశాలు.

"ఆగస్టు 15వ తేదీకి పూర్వము సింధు రాష్ట్రమున్నూ (జూన్ 3వ తేదీపథకము కాలూను) పడమటి పంజాబు రాష్ట్రమున్నూ భావల్పూరున్నూ ఆహారము ఎక్కువగా ఉన్న ప్రదేశాలుగానూ పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమున్నూ బెలూచిస్తాన్ తూర్పు బెంగాలు రాష్ట్రమున్నూ ఆహార పదార్థాలు తక్కువగా ఉన్న ప్రదేశాలుగానూ పరిగణించినారు.

1947-48 లో నిర్ణయించిన ఆహార ప్రాతిపదిక పథకము ప్రకారము సింధు, పంజాబు భావల్పూరులలో అదనముగా ఉన్న ఆహార పదార్థాలను అన్నిటినీ ఇండియాకు ఎగుమతిచేయడము అయిపోయింది. ఇందులో కొంత అప్పు ఇవ్వడమున్నూ జరిగింది.

సరిహద్దు కమీషన్ వారి తీర్పుతో పాకిస్తాన్ ఆహారస్థితికి మొదటి దెబ్బ తగిలింది. పడమటి పంజాబులోనుంచి గురుదాస్‌పూర్ తాలూకాయున్నూ కౌసూరు తాలూకా కొంతభాగమున్నూ తూర్పు పంజాబుకు పోయింది. ఈ ప్రదేశములో గోధుమలు సమృద్ధముగా ఉన్నవి. బెంగాలులో మాల్డా దినాజ్‌పూరు జిల్లాలు ఆహారము అదనముగా ఉండేజిల్లాలు. ఈ రెండు జిల్లాలను తూర్పు బెంగాలులో నుంచి తప్పించడము వల్లనూ ఆహారము అదనముగా ఉండే ఇంకా ఇతర ప్రాంతాలను తప్పించడము వల్లనూ తూర్పు బెంగా

4 వ పేజిచూడుడు

# ఢిల్లీకి గాంధిజీ ప్రయాణం: కలకత్తాపౌరుల వీడ్కోలు

## కత్తితో సాధించేశాంతి చిరస్థాయి కాజాలదని ప్రార్థనసభలో ఉద్బోధ

కలకత్తా, సెప్టెంబరు 7: మహాత్మాగాంధీ తమబృందంతో నేటిరాత్రి ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి బయలుదేరారు. హౌరాకు నాలుగుమైళ్లదూరంలోఉన్న బేలూరు స్టేషనులో ఆయనరైలు ఎక్కారు.

డా॥ వి. సి. ఘోష్, ఆనందప్రసాద్ చేధరీ, శంకరరావుదేవు, హెచ్. ఎస్. సుహ్రావర్దీ. ఓస్మాన్ ప్రభృతులు బేలూరుస్టేషను దాకా వెళ్లి ఆయన్ను సాగనంపారు.

మహాత్మాగాంధి స్టేషనుకు బయలుదేరబోయే ముందు చాలామంది ప్రజలు, ఎక్కువగా స్త్రీలు ఆయనకు పూలహారాలు అర్పించడంకోసం బెలియఘటా బసవద్ద గుమిగూడారు. గాంధిజీ తమగదిలోనుంచి బయటికి రావడంతోటే హైందవ సంప్రదాయం ప్రకారం శంఖ ధ్వానాలుచేస్తూ అక్కడికి వచ్చిన స్త్రీలందరూ ఆయనకు ఉత్సవపూర్వకంగా వీడ్కోలు ఇచ్చారు. మహాత్మాగాంధీ సెలవుతీసుకుంటూ ఉండే ఆయన కాతిథ్యమిచ్చిన ముస్లిం స్త్రీ బీ అమ్మా అత్యాదరంతో కదలాడిపోయింది.

మహాత్మాజీ కారుబయలుదేరడంతోటే స్త్రీ పురుషులందరూ దారి కిరువైపులా వరుసగా నిలబడి మహాత్మా గాంధీకి జై అని గౌరవపూర్వకంగా నినాదాలు చేశారు.

ఆయన నివాసంనుండి బేలూరు స్టేషనువరకూ కలకత్తాపోలీసు కమిషనరు ఎస్. ఎన్. ఛటర్జీగారు గాంధిజీ వెంబడి వెళ్లారు.

జై జై నినాదాలమధ్య గాంధిజీ రైల్లో ఎక్కారు.

## ప్రార్థన సమావేశం

కలకత్తా, సెప్టెంబరు 7: ఢిల్లీకి బయలుదేరబోయేముందు మహాత్మాగాంధీ తమ బెలియఘటా బస ఆవరణలో నేటి సాయంకాల ప్రార్థన జరిపారు. ఈ సమావేశానికి వేలకొలది జనం వచ్చారు.

మొట్టమొదట్లో గాంధిజీ శ్రోతలు మిక్కిలి నిశ్శబ్దంగా ఉన్నందుకు వారిని అభినందించారు. క్లిష్టదినాల్లో అత్యద్భుత సేవచేసినందుకు శాంతి సేవాదళంవారిని గూడా అభినందించారు. అతర్వాతఆయన ఇల్లా అన్నారు:

"శాంతిని నిలబెట్టవలసిన మహాకార్యం ఇప్పుడే ప్రారంభమయింది. మహోజ్జ్వల శాంతిస్థాపనకై స్త్రీ పురుషు లందరూ ప్రాణత్యాగం చెయ్యడానికైనా సిద్ధం కావాలి. క్రమశిక్షణగాని, కాపుదలగాని సాధ్యం కావాలంటే ప్రేమద్వారాకే సాధ్యమవుతుంది. కత్తి చూపించి సాధించేశాంతి చాలాకాలం ఉండదు. అది కేవలం బాహ్య నిర్బంధంవల్ల వచ్చినదికాని అంతఃపరివర్తనవల్ల వచ్చిందికాదు. ఖడ్గ సాధిత ప్రశాంతి భిన్నవర్గాల వైవిధ్యాన్ని మరింత గాఢతరం చేస్తుంది. ఈ శాంతి సాధకయజ్ఞంలో ప్రాణాలను అర్పించిన వారు వీరులేగాని తక్కినవారుకారు.

తర్వాత గాంధిజీ కామ కేంద్రశాంతి స్థాపక సంఘానికి సంబంధించి ఏర్పడనున్న ద్రవ్యసేకరణసంఘ సభ్యులతో సంప్రతించినట్లు తెలియజేశారు. శాంతిస్థాపకసంఘం శాంతికై కృషిచేస్తుంది. ఆ నిధి ద్రవ్యం వసూలుచేసి బాధితులకు ఆహార వస్త్ర గృహాది సౌకర్యాలు కల్పిస్తుంది. ఈ సందర్భంలో బాధితుల ఇళ్లను ఇరుగుపొరుగున ఉన్న వాళ్లు వారిని ఆదరంతో ఆహ్వానించి వారికి భయంలేకుండా చెయ్యడం తమ విధిగా భావించాలని గాంధిజీ విజ్ఞప్తి చేశారు. బాధితుల పునరావాస కార్యక్రమం సాధ్యమైనంత త్వరలో పూర్తి కావాలి. అదెంత త్వరగా జరిగితే అంత త్వరలో శాంతి చేకూరుతుంది. తాము తిరిగివచ్చేటప్పటికి కలకత్తా పౌరులు చేసిన అత్యద్భుత కృషికి అభినందించడం తప్ప తమకింకేమీ పనిఉండకూడదని గాంధీజీ అన్నారు.

### కుష్ఠవ్యాధి నివారణాలయ దర్శనం

ప్రార్థనసభ కాగానేటే గాంధీజీ శ్రీమతి సుశీలానాయర్, సురవర్ది, నిర్మల్ బోస్ గార్లతో మోటారుపై కుష్ఠవ్యాధి నివారణాలయానికి వెళ్లి అక్కడి రోగులను చూచారు. గాంధిజీ రాకకు ఆ సంఘ బహిష్కృతులందరూ అమితానందం వెల్లడించారు. కుష్ఠరోగులు ఇతరులకు తమ వ్యాధిని వ్యాపింపచెయ్యడం మహాదోషమని హెచ్చరించి వారు భగవంతుని శరణు కోరితే ఆయనే సర్వవ్యాధులనూ నివారించగలడని గాంధిజీ వారికి హితబోధ చేశారు. ఇల్లా అన్నందువల్ల వారిని సంఘం బహిష్కరించాలని చెప్పడం కాదనీ, కుష్ఠరోగులను దూరంగా ఉంచడం ప్రజల మూఢ విశ్వాసాలవల్లనే జరుగుతోందనీ ఆయన అన్నారు.

## కలకత్తా ప్రశాంతత

కలకత్తా, సెప్టెంబరు 7: కలకత్తా ఇవ్వాళ పగల్లా చాలా ప్రశాంతంగా ఉన్నదని ఇవ్వాళ రాత్రి పశ్చిమబెంగాలు ప్రభుత్వం ఒక ప్రకటనలో వెల్లడించింది.

ప్రజాహృదయాల్లో ఇతోధికవిశ్వాసం ప్రబలిడంవల్ల అతివారంనాటి ప్రశాంతపరిస్థితులే ఈనాడుకూడా ఉన్నాయి. బజారుల్లో వెనకటికంటే ఎక్కువగా జనం తిరుగుతున్నారు. ట్రాముల్లోనూ బస్సుల్లోనూకూడా జనం ఎక్కువగా నిర్భయంగా తిరుగుతున్నారు. శాంతి సంఘాలు ఇంటింటికీ తిరిగి ప్రచారం చేస్తున్నాయి. పోలీసుకాపలా మామూలుగానే ఉంటోంది.

ఒక సినిమాహాలువద్ద కొంత ఘర్షణ జరగగా పోలీసులు జోక్యం కలిగించుకోవలసివచ్చింది. దొంగటిక్కెట్లు అమ్మేవాడివల్ల వచ్చిన అల్లరేగాని ఇందులో మతప్రసక్తి ఏమీలేదు. అల్లరి సద్దుమణని పోయిన పోలీసును దుండగీడొకడు రాయితో కొట్టగా ఆత్మసంరక్షణార్థం కాల్పవలసివచ్చింది. 6 గురికి గాయాలు మాత్రం తగిలాయి. అల్లరిమూక సినిమా హాలులో కుర్చీలనూ బల్లలనూ తగలబెట్టింది. అట్టే నష్టం కలగలేదని తెలుస్తున్నది.

## బొంబై పరిస్థితి

బొంబై, సెప్టెంబరు 7: ఆదివారం రాత్రి సెస్రీ ప్రాంతంలో మందుపాతరు ప్రేలడంవల్ల ఇద్దరు చనిపోయారు. 18 మంది గాయపడ్డారు.

ఇంతకుముందు రెండుచోట్ల కత్తిపోట్లు తటస్థించినట్లు వార్తలు వచ్చాయి. పోలీసు ఉద్యోగులు తగినశ్రద్ధ తీసుకుంటున్నారు. పరేల్ ప్రాంతంలో కర్ఫ్యూ పొడిగింపబడింది.

## కలకత్తాలో ఉపవాసదినం

కలకత్తా, సెప్టెంబరు 7: కలకత్తాలో చాలా మంది ప్రజలు ఇవ్వాళ ఉపవాసం చేసి రోజల్లా ప్రార్థనలతో కాలక్షేపము చేశారు. పట్టణంలో ఇటీవల చెలరేగిన మతవైషమ్య మహాపాపానికి ప్రాయశ్చిత్తముగా ఆత్మశుద్ధికోసం ప్రజలందరూ సమష్టిగా ఈనాడు ఉపవాసం చెయ్యాలని ఆచార్య కృపలానీ, డా॥ ప్రఫుల్లచంద్ర ఘోష్, సురవర్ది గార్లు చేసిన విజ్ఞప్తి ననుసరించి ఈ ఉపవాసదీక్ష వహించారు.

## కాసూరు సరిహద్దు గ్రామాలపై దాడి

లాహోరు, సెప్టెంబరు 7: ఇవ్వాళ రాత్రి లాహోరుకు వచ్చిన వార్తలనుబట్టి లాహోరు జిల్లా కాసూర్ సబ్ డివిజన్‌లోని రెండు సరిహద్దు గ్రామాలపై కొందరు సాయుధులైన దుర్మార్గులు దండెత్తి వచ్చారని తెలుస్తున్నది.

అయితే వారిని గ్రామస్థులు అటకాయించి తరిమివేశారు. ఉభయ పక్షాలలోనూ కొంతమంది చనిపోయారు. లాహోరు జిల్లా మేజస్ట్రేటు గ్రామస్థులు ప్రదర్శించిన ధైర్యసాహసాలకు అనుగుణముగా వారిని బహూకరించవలసిందని వెంటనే ఉత్తర్వులు జారీచేశారు.

కాసూర్ లోకి సిక్కు సంస్థానాల నుంచి చాలామంది కాందిశీకులు వస్తున్నారు.

ఖిలాగుజర్ సింగ్ ప్రాంతంలో లాహోర్ పోలీసులు సోదా చెయ్యగా చోరీ అస్తి చాలా పట్టుబడింది. కొంతమందిని అరెస్టుచేశారు.

## నిజాం జెయిళ్లల్లో రాజకీయ ఖైదీల నిరశనవ్రతం

### విద్యార్థులకు ప్రభుత్వ హెచ్చరిక

[ఆంధ్రపత్రిక విలేఖరి]

హైదరాబాదు, సెప్టెంబర్ 7: స్వామి రామానందతీర్థగారినీ, చంచల్‌గూడా సెంట్రల్ జైలులోని ఇతర డిటెన్యూలనూ జైలు అధికారులు భారతదేశంలో ప్రముఖమైన పత్రికలు చదవనివ్వడం లేదని సంస్థాన కాంగ్రెసు కార్యాలయ ప్రకటవల్ల తెలుస్తున్నది.

చెన్నపట్నంనుంచి వెలువడే 'ఆంధ్రప్రభ' లాహోరునుంచి వెలువడే "వీర భారత్" దినపత్రికలు ఉద్రేకపరచే వార్తలు ప్రచురిస్తున్నాయనీ హైదరాబాద్ రక్షణచట్ట నిబంధనల ననుసరించి ఆ పత్రికలను సంస్థానంలో అమ్మడం, కొనడం, పంచిపెట్టడం, ప్రచురించడం, నిషేధించడమైందనీ నిజాం ప్రభుత్వం జేడౌక ప్రకటన చేశారు. ఆపత్రికలలోని వార్తలు తర్జుమా చేసిగానీ, సంగ్రహించిగానీ జరిగే ప్రచురణలనుకూడా నిషేధించినట్లు ప్రకటించారు.

### విద్యార్థులకు హెచ్చరిక

అఖిల హైదరాబాద్ విద్యార్థి సమితి వారు, సెప్టెంబర్ 8-వ "నిర్బంధవిధాన ప్రతిఘటన" దినం జరపాలనీ, విద్యార్థులందరూ ఊరేగింపుల ద్వారా ప్రదర్శనాలు జరపాలనీ ఒక విజ్ఞప్తిచేశారు.

ప్రభుత్వంవిద్యార్థులపై నిర్బంధవిధానం అవలంబించారన్నమాట అబద్ధమనీ, సెప్టెంబర్ 2 వ తేదీన విద్యార్థులు ప్రభుత్వ ఉత్తరువులకు భిన్నంగా ఊరేగింపులు జరిపినప్పుడు చూపిన సహనభావమే ఇందు కునిదర్శనమనీ, అట్టి ప్రదర్శనములవల్ల శాంతికి భంగం కలిగే అవకాశం ఉన్నందువల్ల ఇకముందు అట్టి వాటిని ప్రభుత్వం సహించదనీ అభిజ్ఞనిని పురస్కరించుకొని ప్రభుత్వం ఒక ప్రకటనచేశారు.

### పతాకనిషేధంగురించి మరికొంత వివరణ

నిజాంప్రభుత్వం పతాకాలవిషయమై జారీచేసిన ఉత్తరువుగురించి నేడు అధికారికొక్కొ మరికొంత వివరణ వెలువడింది. సంస్థానంలో ఆసఫియా పతాకం మినహా మరే ఇతర సంఘపతాకంగానీ, మతపతాకగానీ ఎగురవేయరాదని ఆవివరణ.

## గంగాపూర్ జైలులో నిరశనదీక్ష

ఔరంగాబాద్ జిల్లా గంగాపూర్ జైలులోని 32 మంది నిరశనవ్రతం చేస్తున్నట్లు కాంగ్రెస్ కార్యాలయ ప్రకటనవల్ల తెలుస్తున్నది.

భారతపతాకం ఆవిష్కరించినందుకు గానీ, సత్యాగ్రహం చేసినందుకుగానీ ఇంతవరకూ సంస్థానంలో 47 మంది అరెస్టు అయారని ఆ ప్రకటనలో వుంది.

వివిధ జిల్లాలలో, తాలూకాలలో, అబ్కారీ శాసనోల్లంఘనం సందర్భంలో సుమారు 19 వేల తాడిచెట్లు కొట్టివేయబడినవట.

## బీదర్ జైలులో సత్యాగ్రహుల బాధలు

బీదర్ జైలులోని సత్యాగ్రహులను అధికారులు సరిగా చూడడంలేదనీ, తమ బాధలు తెలియచేస్తూ సత్యాగ్రహులు ఫిర్యాదుచేశారనీ, అధికారులు తగు చర్యలు తీసుకొనకపోతే పరిస్థితి విషమిస్తుందని తెలుస్తున్నది. సత్యాగ్రహులు ఈ దిగువ వివరించిన బాధలకు గురి అవుతున్నట్లు తెలుస్తున్నది: రోజుకు 16 శేర్ల ధాన్యం విసిరించడంలాంటి కష్టమైన పనులు సత్యాగ్రహులచేత చేయిస్తున్నారు. ఇందులో శిక్ష విధింపబడినవారూ, విచారింపబడుతున్నవారూ అన్న భేదంకూడా పాటించడం లేదు. వారి స్వంతదుస్తులు తీసుకోనివ్వడం లేదు. డిటెన్యూలను విడిగావుంచక, అందరినీ 3 వ తరగతిలోనే వుంచుతున్నారు. భోజనం తదితర ఖర్చు లూ అన్నిటికీ కలిపి రోజుకు ఒక్క రూపాయ ఇస్తున్నారు. పత్రికలు వస్తువు చేయడంలేదు స్వంతంగా తెప్పించుకో నివ్వడంలేదు. జైలు ఆవరణలో కూడా తిరగనివ్వడంలేదు. సెల కొకసారైనా బంధువులను చూడనివ్వడంలేదు. సెలిసెలిమాప పనులకోపెడుతున్నారు.

## ఇద్దరు రైతుల దుర్మరణం

నారాయణఖేడ్ తాలూకా అబేద గ్రామరైతులు ఇద్దరు జైలు అధికారులు తింటి పెట్టనందున మరణించారు. తేపీ వసూలు సందర్భంలో వీరు మరి 8 మందితో కలిసి కాసెల్దారును కొట్టారనే ఆరోపణపై వీరిని అరెస్టు చేసినట్లు తెలిసింది.

## సికింద్రాబాద్ నిర్మానుష్యమై పోయింది

### కల్లోలానికిగురియైన ప్రాంతాలలో ఛత్తారీ నవాబు పర్యటన

నిజాం ప్రధాని ఛత్తారీ నవాబు రక్షణాశాఖమంత్రి నవాబు జైన్‌యార్ జంగు బహదూర్‌గార్లు సికిందరాబాదులో కొట్లాటలు జరిగిన ప్రదేశములకువెళ్లి చూశారనీ సికిందరాబాదులోవీధులన్నీ నిర్మానుష్యమైపోయాయనీ అధికార పూర్వకముగా ప్రకటించారు. పట్టణములోని అనేకమంది ప్రజలు ఇతర ప్రాంతాలకు పారిపోయారనికూడ ప్రధానమంత్రికి తెలియవచ్చింది.

ఘర్షణలు జరిగినందుకు విచారమును వెలిబుచ్చుతూ ఇటీవల జరిగిన సంఘటనల విషయమై పోలీసులు దర్యాప్తు చేయుచున్నారనీ, సుందాలమీద తక్షణం చర్య తీసుకుంటామనీ, ఛత్తారీనవాబు హామీ నిచ్చారు.

శాంతిభద్రతలను కట్టుదిట్టముగా కాపాడు విషయమై పోలీసుదళములను ఇంకా వృద్ధిచేయుటకును, అన్నివర్గాలనుండి పౌర రక్షకదళాలను తయారుచేయుటకు తగిన చర్య తీసుకొంటున్నామనికూడా చెప్పాడు సికిందరాబాద్ పట్టణమంతా ప్రభుత్వ అదుపులో ఉన్నదనీ, అవసరం వచ్చినపుడు ప్రతి వ్యక్తికి (అతడు ఏ స్థానానికిగాని, ఏ మతానికిగాని, ఏ జాతికిగాని చెందినవాడయినా) సహాయము చేయవలసిందిగా పోలీసులకు ఉత్తరువులను పంపామని, కాబట్టి రక్షణకై యీ పట్టణమునుండి పారిపోయిన ప్రజలు మరలవచ్చి తమ పనులలో నిమగ్నులు కావచ్చునని ఛత్తారీ నవాబు చెప్పాడు.

## నిజాం కొత్తఫర్మానా

సంస్థానములో శాంతిభద్రతలు కాపాడుటకొరకు సంస్థానములోని మాజిస్ట్రేటులుదరకు, సబిన్స్పెక్టర్లకు కొన్ని ప్రత్యేకాధికారాలిస్తూయీరోజున నిజాం ప్రభుత్వము ఒక ప్రత్యేక ఆర్డినెన్సును జారీచేసిందని అధికారపూర్వకముగా తెలిసింది.

ఈ ప్రత్యేక ఆర్డినెన్సుప్రకారం ఎవరైనను నిషేధప్రదేశాలలో శాంతిభద్రతలకు భంగం కలిగించినచో వెంటనే కాల్చబడుదురు. నిషిద్ధ ప్రదేశాలలో ప్రవేశించుటగాని, ప్రభుత్వాధికారులను ఉల్లంఘించుటగాని, ఇందరలైన శాంతిభద్రతలకు ముప్పువాటిల్లే ఏ పనులు చేసినప్పటికీ, అందరికీగాని, లేక అందులో కొంతమందికిగాని మరణశిక్ష విధింపబడును.

ప్రభుత్వాజ్ఞలను ఉల్లంఘించిన వారిని విచారణచేయుటకు ప్రభుత్వము ప్రత్యేకముగా ఒక న్యాయస్థానమును నియమించింది. అందులోని న్యాయమూర్తి సెషన్సు జడ్జి హోదా కలిగిఉంటాడు.

## ప్రభుత్వ మంత్రుల అత్యవసర సమావేశం

హైదరాబాద్ ప్రభుత్వ మంత్రుల అత్యవసర సమావేశము యీరోజు మధ్యాహ్నము షామంజిల్‌లో జరిగెను. ఛత్తారీ నవాబ్ అధ్యక్షతవహించాడు.

హైదరాబాద్ ప్రభుత్వమునకు ఇండియన్ యూనియన్ ప్రభుత్వ మునకు జరుగుచున్న రాయబారములను గురించి ముఖ్యముగా చర్చించారని తెలియుచున్నది.

ఇంకను రాయబారములు కొనసాగించుటకు ఛత్తారీనవాబ్ రేపువిమానము మీద ఢిల్లీ వెడతాడు. హైదరాబాద్ ప్రభుత్వ సలహాదారుడు, సర్ వాల్టర్ మాంక్టన్ ఇప్పుడు ఢిల్లీలోనే ఉన్నాడు.

### నిజాంవిద్యార్థులకు అలీఘర్ విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ సలహా

అలీఘర్ విశ్వవిద్యాలయ పరిసరాలు కల్లోలముగా నుండుటచే, హైదరాబాదు నుండి అలీఘర్ విశ్వవిద్యాలయమునకు వచ్చు విద్యార్థులు ప్రస్తుతము రావద్దని అలీఘర్ విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ సలహా నిచ్చాడు.

### సంస్థాన రైల్వేశాఖ ప్రకటన

మైసూరు సంస్థాన రైల్వే కార్మికులు సమ్మెచేసినట్లయితే నిజాం సంస్థానము నుండి మైసూరునకు వెళ్లే ప్రయాణీకులకు యిబ్బంది కలుగును. కాబట్టి ఆరైలు మీదిస్టేషనులకు టిక్కెట్లు ఈయబడవు' అని నిజాం సంస్థాన రైల్వే కార్యాలయము వారు ఒక ప్రకటన చేశారు.

## పటేల్ విజ్ఞప్తి

(1-వ పేజీ తరువాయి)

అక్కడక్కడ, కొట్లాటలు, కత్తిపోట్లు జరిగినట్లు వార్తలు వచ్చాయిగాని ఎంతమంది అభాగ్యులు హతమైంది ఇంత వరకూ నికరంగా తెలియలేదు. కొన్ని ప్రాంతాల్లో బాంబులుకూడా విసరబడ్డాయి. పట్టణంలో వీధులన్నీ ఇంచుమించు నిర్మానుష్యమయ్యాయి.

ఇవ్వాళ నిన్నకూడా అక్కడక్కడ కత్తిపోటులుజరిగాయనీ ఇవ్వాళ 12 గురు చనిపోయారనీ 7 గురు గాయపడ్డారనీ జిల్లా మేజస్ట్రేటు ఇవ్వాళ ఉదయం విడుదలచేసిన పత్రికా ప్రకటనలో ఉన్నది.

ఫైజ్ బజారు పోలీసుస్టేషను వద్ద ఒక బాంబు పేలి ఇద్దరు గాయపడ్డారట.

టర్క్మెన్ గేటువద్ద ప్రభుత్వసంస్థ నొకదాన్ని లూటీచేశారు. మరొకటి తగలబెట్టబడింది. షాహీచీ పోలీసుస్టేషను వద్ద చాలా బాంబులుపడ్డాయి. కాని వాటిలో ఒకటి మాత్రమే పేలింది. ఎవ్వరూ గాయపడలేదు. పోలీసులు తక్కువ బాంబులను స్వాధీనం చేసుకున్నారు. ఫోరా కోటిన్ ప్రాంతాల్లో పోలీసులు తుపాకులు కాల్చడం వల్ల 9 గురు చనిపోయారు. మరి నలుగురు గాయపడ్డారు. పట్టణంలో మొత్తం మీద 18 మంది కత్తిపోట్లకు గురి అయినట్లు తెలిసింది.

ఆ తర్వాత న్యూఢిల్లీ ఇంచు మించు ప్రశాంతంగానే ఉన్నది. పట్టణం ఎల్లెడలా మిలిటరీ సవారీలు కాపలా కాస్తున్నాయి.

అధిక సంఖ్యాక మతవర్గ ప్రదేశాలలోని మైనారిటీలను సురక్షిత ప్రదేశాలకు చేర్చడం రోజల్లా సాగుతూనే ఉన్నది.

భారతప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, రక్షణ మంత్రి సర్దార్ బలదేవ్ సింగుగార్లు ఇవ్వాళ ఉదయం కల్లోలిత ప్రాంతాలను దర్శించి తగిన కట్టుబాట్లు చేశారు.

## పాకిస్థాన్‌లో ఆహారపరిస్థితి

1-వ పేజీ తరువాయి

లలో ఆహార కరువు ఏర్పడిపోయింది. దీనికితోడుగా చిట్టగాంగు వరదల వల్ల తూర్పు బెంగాలు ఇప్పటిలో కోలుకొనే స్థితికూడా లేదు. అక్కడి లేమను తగ్గించగా ప్రయోజనము ఉండదు. పశ్చిమ పంజాబు సంక్షోభమువల్ల అసలే అంతంత మాత్రముగా ఉన్న ఆహార స్థితి మరింత క్లిష్టము అయిపోయింది.

కాందిశీకుల సమస్యయున్నూ, పశ్చిమ పంజాబునుంచి వెళ్లిపోయిన కాందిశీకులు అనుసరించిన భూదగ్ధ విధానంవలన తిండి గింజలు గొడ్డూగోదా యాంత్రికలపసామానులు నాశనం అయిపోయినవి. పశ్చిమ పంజాబు ఆహార పరిస్థితులున్నూ రాజ్య నిర్వహణమున్నూ కష్టభూయిష్టము లయినవి.

సరిహద్దు రాష్ట్రానికిన్నీ, బెలూచిస్తానుకున్నూ, తూర్పు బెంగాలుకున్నూ పాకిస్తాన్ ప్రభుత్వములో చేరిన సంస్థానాలవారికిన్నీ, హిందూస్తాన్‌నుంచి పశ్చిమ పంజాబు రాష్ట్రమును చేరిన కాందిశీకులకున్నూ ఆహారము అందచేయవలసిన సమస్త పాకిస్థాన్ ప్రభుత్వాన్ని ఎదుర్కొన్నది. పశ్చిమ పంజాబునుంచి వెళ్లే ఒక్కొక్క కాందిశీకుడికి హిందుస్తాన్, నుంచి ఇద్దరిద్దరు కాందిశీకులు వస్తున్నారు.

తూర్పు బెంగాలుకు 75,000 టన్నుల తిండి గింజలు కావలసి ఉన్నవి. గోధుమలు బియ్యముకలిపి సరఫరా చేదామన్నా ఇంత మొత్తము లభ్యముకాదు. పైగా తూర్పు బెంగాలువారు గోధుమలు తినడానికి అలవాటు పడ్డవారు కారు. ఏది ఏమైనప్పటికిన్నీ ఈ సంవత్సరాంతానికి వీలు అయినంతవరకూ బియ్యమూ గోధుములు తూర్పు బెంగాలుకు పంపించే ఏర్పాట్లు జరిగినవి.

భారతదేశానికి ఎగుమతిచేసే అదనపు ఆహారపదార్థాలను ఎగుమతిచేయగా వచ్చే సొమ్ముతో తరుగును భర్తీచేయడానికి రెండే మార్గాలు ఉన్నవి. లేమ, ఆచరణలో పెట్టి తిండిగింజలను పొదుపుచేయడమున్నూ విదేశాలనుంచి ఆహారము తెప్పించుకోవడమున్నూ చేయవలెను. ఈ రెండో మార్గము ప్రపంచ ఆహారపరిస్థితులమీద ఆధారపడుతుంది. అందువల్ల పాకిస్తాన్ పౌరులు అందరున్నూ ఆహార సంక్షోభాలవల్లనూ వరదలవల్లనూ ఇండ్లూ వాకిళ్లూ పోయి నిరాధారులై అన్నార్తులయిన వారితో సమ సౌర్ధక త్యాగము చేసి తమవంతు ఆహారములో కొంత భాగాన్ని ఇవ్వవలసి ఉంది."

## చిట్టగాంగు దురవస్థ

కలకత్తా, సెప్టెంబరు 7: "ఈమధ్య వచ్చిన వరదకు చిట్టగాంగు జిల్లాలో పదిలక్షలమంది జనులు నిరాధారులయి పోయినారు"అని చిట్టగాంగ్ బాధా నివారణ సంయుక్తసంఘ ఉపాధ్యక్షుడు అంబికా చక్రవర్తియున్నూ, కమ్యూనిస్టు నాయకులు అబ్దుల్ హలీమ్ నిరంజన సేన్ కలసి ఒక ప్రకటనము చేసినారు. ఆ ప్రకటనములో ముఖ్యాంశాలు.

వరిపయిరు సంపూర్ణముగా నాశనము అయిపోయింది. వరిపయిరు అయ్యేప్రదేశములో ఉన్న ఇండ్లు కొంచెమించు అన్నీ కొట్టుకొనిపోయినవి. భూములన్నీ వరదలు కొన్ని వండుపట్టిపోయినవి. కొన్ని ఇసుకమ్ములు వేసుకొనిపోయినవి. ఈ భూములలో పయిరు కనపడకుండా పోయింది. కొట్టుపశువులు అన్నీ పూర్తిగా వేసుకొని పోయినవి. ఒకబిందెడు నీళ్లకు మూడు నాల్గు మైళ్లు పోతేనేకాని దొరకవు."

చిట్టగాంగ్ కమ్యూనిస్టుపార్టీ వారు ఈ విధముగా తెలియచేశారు.

సెప్టెంబరు 2వ తేదీనుంచీ మళ్లీ వానలు ఆరంభము అయినవి. కొన్ని ఊళ్లలో ఆరు అంగుళాలవాన పడ్డది. రెండో పంట కోసము పోసినవారు కొట్టుకొనిపోయింది ముదురువారు మురిగిపోయింది.

మణుగు బియ్యము 53 రూపాయలకు అమ్ముతున్నారు.

## కాందిశీకుల రక్షణకై ఏర్పాట్లు

(1 వ పేజీ తరువాయి)

భారత ముఖ్య సేనాని అక్కడి పరిస్థితులను గూర్చి తెలిపే విషయాలనూ, మంత్రులంగాని తదితరులు వాచేసిన పర్యటన వల్ల సేకరింపబడే సమాచారాలనూ వినిన తర్వాతనుతుంగా నిన్నటి సమావేశంలో తేలిన నిర్ణయాలను బట్టి ఏగతేకమంత్రివర్గం వారు ఏవిధంగా చర్య తీసుకొన్నది పరిశీలించడమూ, ఆ తర్వాత పరిస్థితిని చక్కబరచడానికై వచ్చే సూచనలను చర్చించి ఏదో ఒక నిర్ణయానికి రావడమూ ఈ సంఘంవారి నిర్వహ్య కార్యక్రమాలు.

ప్రభుత్వ భవనంలో దీని విషయమై అవసర మిలిటరీ శాఖను కూడా ఏర్పరిచారు. ఈ శాఖ ఆధీనంలో ఒక ప్రత్యేక పోలీసు పటాలు గదికూడా ఉంటుంది. మంత్రివర్గపు అత్యవసర సంఘం వారు గాని తక్కిన మంత్రులుగాని ఇతర అధికారులు గాని దీనికి సంబంధించిన వారందరూ కల్లోల పరిస్థితిని సమగ్రంగా తెలుసుకోగలిగేందుకు ఈ గది వారందరికీ అందుబాటులో ఉంటుంది.

మంత్రివర్గపు అత్యవసర సంఘానికి అవసరమైన ప్రచారం నిమిత్తం ఒక ప్రత్యేక ప్రచారక సంఘంకూడా నెలకొల్పబడింది.

నేటి సమావేశంలో ఢిల్లీ పరిస్థితిని కూడా పరిశీలించారు. తక్షణం కొన్ని గానాలను ప్రకటనలు వెల్లడించబడ్డాయి. హత్యాప్రయత్నం, వస్త్రాపహారణం, నిర్బంధ మానభంగం, చౌర్యం, దోపిడీ, గృహదహనం మొదలైన పెద్ద పెద్ద నేరాలకు అంతకుతగిన అర్హమైన వానినిగా పరిగణిస్తామని ఆ ప్రకటనలో ఉన్నది.

అసిస్టెంటు సబ్ ఇన్‌స్పెక్టరు హోదాకు తగ్గని మేజస్ట్రేటులూ, పోలీసు ఉద్యోగులూ, మిలిటరీ ఉద్యోగులూ, వైమానిక దళోద్యోగులూ కూడా ఆక్రమ సమావేశాలను చెదరగొట్టడానికీ, శాంతి సంరక్షణకూ, కాల్పులు చేసిగాని మరే శక్తి నుపయోగించిగాని శాంతి భద్రతలు కాపాడగల అధికారం కలిగిఉంటారు.

## కొరియా ప్రజాపక్షాలపై అమెరికా చర్యలు

### మొలటాఫ్ నిశిత విమర్శ

మాస్కో, సెప్టెంబరు 7: కొరియా స్వాతంత్ర్యవిషయమై అమెరికా ఆగస్టు 29 వ తేదీన చేసిన ప్రతిపాదనలను సోవియట్ ప్రభుత్వం నిరాకరించింది. అమెరికా విదేశశాఖ సహాయమంత్రి లావెట్, కొరియా సమస్యను పరిష్కరించేందుకు అమెరికా, చైనా, రష్యా, బ్రిటన్ల సమావేశాన్ని 8 వ తేదీన జరపమని ప్రతిపాదించాడు. దీనిని నిరాకరిస్తూ సోవియట్ విదేశాంగమంత్రి మాలటోఫ్ ఈ విధంగా ప్రకటించాడు:

"కొరియాలో ఉన్న సోవియట్ అమెరికన్, సంయుక్త సంఘంలో అమెరికన్ ప్రతినిధివర్గం, కొరియాలో నిజమైనప్రజా ప్రభుత్వాన్ని ఏర్పరిచేందుకు ఏమాత్రమైన సహకారమైనా చేసే అభిప్రాయం కనపరచలేదు. అటువంటిది ఏమాత్రం కనపడినప్పటికీ, పరిస్థితులలో ప్రతిష్టంభన ఏర్పడేదికాదు.

తాత్కాలికంగా కొరియాలోని సర్వపక్షాలతోనూ శాసనసభను ఏర్పరచవన్న సోవియట్ ప్రతిపాదనను అమెరికా నిరాకరించింది. ఇది కూడా ప్రజాపక్షాలకు స్వేచ్ఛను ఇచ్చినప్పుడే సాధ్యపడుతుంది. అందుకే కాకుండా తన ఆక్రమణ కిందవున్న దక్షిణ కొరియాలోని అనేక ప్రజాస్వామిక సంస్థల ప్రతినిధులను అరెస్టు చేయటం మొదలైన ప్రతీకార చర్యలకు అమెరికా దిగి, ప్రజాస్వామిక న్యాయసూత్రాలను స్వస్తి చెప్పటమే కాకుండా కొరియా విషయంలో చేసుకున్న ఒప్పందాలను కూడ భగ్నం చేసినది. కాబట్టి అమెరికా ప్రతిపాదనను రష్యా అంగీకరించదు.

ఈ ప్రతిపాదనలు ఉత్తర దక్షిణ ప్రాంతాలకు ప్రత్యేక శాసనసభలను ఏర్పరచాలనటం వల్ల, కొరియా పూర్తి విభజన అనే సూచనలు కనపడుతున్నవి."

### ప్రావ్‌దా వ్యాఖ్య

"దక్షిణ కొరియాలోని అమెరికన్ సైనిక ప్రభుత్వం మాస్కో నిర్ణయాలను భగ్నం చేయాలనే ఉద్దేశంతోనే వ్యవహరిస్తున్నది. ప్రజాస్వామిక పక్షాల నాయకులందరినీ పెద్ద ఎత్తులో అరెస్టుచేసి తరవాత జరిపిన ఎన్నికలవల్ల ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి ప్రబలినది." అని కమ్యూనిస్టు పార్టీపత్రిక ప్రావ్‌దా వ్యాఖ్యానించింది.

## అగ్రరాజ్యాల్లో బ్రిటనుకు సమాన హోదా లేదా?

వాషింగ్‌టన్, సెప్టెంబరు 7: బ్రిటనుకు అగ్రరాజ్యత్రయంలో సమానహోదా లేదని స్పష్టీకరించిన రహస్యపత్ర మొకటి దేశీయశాఖవారివద్ద నున్నదని "వాషింగ్‌టన్‌పోస్టు" పత్రిక వ్రాసింది. ఈ వార్తను గురించి ఏమీ చెప్పటానికిదేశీయశాఖవారు నిరాకరిస్తున్నారు. ఈ పత్రమును దేశీయశాఖ, విధాననిర్ణయసంఘంవారు తయారుచేసి విదేశముఃపచేయవలసిన సహాయమును గురించి ఆలోచిస్తున్న కాంగ్రెస్ సభ్యుల సంఘమునకు పంపినట్లు తెలుస్తున్నది.

బ్రిటన్, హాలెండు, ఫ్రాన్సు, పోర్చుగల్, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, గ్రీస్, టర్కీ, డెన్మార్క్, స్వీడన్, ఫిన్లండు, జెకోస్లవేకియా, పోలెండు రాజ్యాలు బలుతోసహాయం లేనిదే కమ్యూనిస్టు రష్యా ఒత్తిడి తట్టుకొనలేవని ఈ పత్రములో వ్రాశారని తెలుస్తున్నది.

## దక్షిణాఫికాలో ఏటం పరిశోధన

జో హానెస్ బర్గ్, సెప్టెంబరు 7: నెటాల్ సరిహద్దులోనున్న ఆక్స్కివిరము పై 11,160 అడుగుల యెత్తున ఆటంమ కాస్మిక్ కిరణాలచే ధ్వంసం చేయుటవలన కల్గు ఫలితములను గురించి పరిశోధించుటకు నిట్‌వాటర్స్రాండు విశ్వవిద్యాలయాచార్యులు హాంట్లీగారు కృషిచేస్తున్నారు. ఆటంను కృత్రిమవిధానములవల్ల గాక, స్వాభావికరీతిగా నక్షత్ర కాస్మిక్ కిరణములచే ధ్వంసం చేయుటవలన గొప్ప ఫలితములు కలుగవచ్చుట. భూమినుండి ఎంత ఎత్తుకు పోయిన, కాస్మిక్ కిరణములు అంత ఎక్కువగా పనిచేయునట.

## ఆచార్య కృపలానీ

కలకత్తా, సెప్టెంబరు 7: రాష్ట్రపతి ఆచార్య కృపలానీగారు రేపు కలకత్తానుంచి బయలుదేరి విమానంపై ఢిల్లీకివెళ్లనున్నారు.

## జునగఢ్‌లో ప్రజాఉద్యమ సూచన

### పాకిస్థాన్‌లో చేరినందుకు అసమ్మతి

బొంబాయి, సెప్టెంబర్ 8: పాకిస్థాన్‌లో చేరుటా జునగఢ్ సంస్థానాధీశుడు చేసిన నిర్ణయానికి అసమ్మతి చెంది, సంస్థాన ప్రజలు ఉద్యమాన్ని ప్రారంభించే ప్రయత్నాల్లో ఉన్నారని తెలుస్తున్నది. కథియవాడ్ రాజకీయ మహాసభ, సంస్థాన ప్రజామండలివారు సర్దార్ పటేల్‌తోనూ అఖిలభారత సంస్థాన ప్రజామండలి అధ్యక్షుడు డా॥ పట్టాభి గారితోనూ ఈ ఉద్యమం విషయమై చర్చించినట్లు తెలుస్తున్నది. జునగఢ్‌లోని కేవులన్నిటినీ బహిష్కరించేందుకూ, జునగఢ్ సంస్థాన ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిలబడే జాగీర్దార్లకు సాయపడేందుకూ వీరు నిర్ణయించుకున్నట్లు తెలుస్తున్నది.

కథియవాడ్‌లోని మిగిలిన సంస్థానాధీశులంతా జునగఢ్ నిర్ణయానికి అసమ్మతిచెంది, ఆ సంస్థానానికి వ్యతిరేకంగా ప్రజామండలి కానీ, ఇండియా ప్రభుత్వం కానీ ఏ చర్య తీసుకున్నా సాయంచేయటానికి సిద్ధంగా ఉన్నారని కూడ తెలుస్తున్నది. (యు. పి. ఐ.)

## ఇండోనీసియాకు పోతున్నమందులజప్తు

### డచ్చివారి చర్య
### రష్యా రెడ్‌క్రాస్ ఆక్షేపణ

మాస్కో, సెప్టెంబరు 7: ఆస్ట్రేలియన్ రెడ్‌క్రాస్ సొసైటీ ఇండోనీసియన్ రిపబ్లిక్‌కు పంపిన మందులను డచ్చివారు జప్తుచేసినందులకు సోవియట్ రెడ్‌క్రాస్ సొసైటీ కార్యవర్గమువారు జనీవాయందలి రెడ్‌క్రాస్ సంఘముల సమితి సెక్రటరీ జనరలుకు అసమ్మతిని తమనుసమర్పించిరి.

'రెడ్‌క్రాస్ ప్రధాన సూత్రములకు ఈ చర్య విరుద్ధమని మేము తలచుచున్నాము. ఆ మందులను సమ్యక్స్థానము చేర్చవలసినదిగా డచ్చివారిని ప్రోత్సహించవలెనని, మాటిట్లు జరగకుండా చేయవలెనని మిమ్ము ప్రార్థించుచున్నాము' అని ఆ సమ్మతి తెలుపు పత్రములో వారు చెప్పచున్నారు.

### ఆంధ్ర యువజన వర్కర్ల సమావేశం

ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ సూరపనేని రామకోటగిరి రావు గారి అధ్యక్షతన కార్యక్రమువారు వి. పి. హాలులో సమావేశమై రేపు ఉదయం 9 గం॥ లకు మహాసభ హాలులో రాష్ట్ర యువజన వర్కర్ల సమావేశము జరుపుటకు తీర్మానించారు. మద్రాసులోని ఆంధ్ర విద్యార్థి యువజన సోదరులను హాజరు కావలసినదిగా ప్రత్యేకముగా కోరుచున్నారు.

ప్రస్తుత రాజకీయ పరిస్థితులు యువజన కాంగ్రెసుఅనుబంధిమయంపై చర్చించెదరు.

ప్రకటన

నా కుమారుడు కనిగోళ్ల వెంకట రత్నం, ... యిల్లు విడిచి వెళ్ళినాడు. వానిని లోపరుమని గాంచిన ... పుస్తకములలో వున్నట్లు తెలియుచున్నది. నాకున్న ఆస్తి అంతయూ నా స్వాధీనమయి వున్నది. నా కుమారునికి యెట్టి ఆస్తియూ లేదు ... 

కనిగోళ్ల ... కుమారుడు,
... కట ముత్యాలు,
... నాదరి



## అహింసకెన్నడు అపజయము లేదు

### 'హరిజన్' పత్రికలో గాంధి మహాత్ముని వ్యాసము

అహమ్మదాబాద్, సెప్టెంబరు 7: ప్రశ్నా పేటిక అను శీర్షికను గాంధి మహాత్ముడు నేటి హరిజన పత్రికలో ఈ క్రింది విధముగా వ్రాయుచున్నాడు:

ప్రశ్న: నవఖాళీలో మీ ఉద్యమము అపజయము గాంచిన యెడల మీ అహింసకు అపజయము కలిగినదగునుగాని, అసలు అహింసకు అపజయము కలుగదని నవఖాళీలో నున్నప్పుడు అనేకసార్లు మీరు చెప్పియుంటిరి. కలకత్తాలో సాధింపబడిన దానినిబట్టి మీ అహింస జయప్రదమయ్యెనని మీరు తలచుచున్నారా లేక జయప్రదము కాబోవుచున్నదని తలచుచున్నారా?

సమాధానము: నాకు ఆరోపింప బడిన ప్రకటన సరియైనది కాదు. అహింసకు అపజయమెన్నడును లేదు. అది అమోఘమైనది. అది అపజయముగాంచినట్లు కనబడినప్పుడు అపజయము అహింసావలంబకుని అసమర్థతవల్ల కలుగును. నవఖాళీలో నా అహింస అపజయముగాంచెనని గూడ చెప్పవీలులేదు. అది పరీక్షకు లోనగుచున్నది నా అహింస అని చెప్పినప్పుడు అది కేవలము నాకొక్కనికిమాత్రమే సంబంధించినదని నేను తలపను. దానిలో నా సహచరులందరిని, నన్ను చేర్చుకొనవలెను. నవఖాళీ విషయమై నేను చెప్పినది కలకత్తాకుగూడ వర్తించును. ఈ మహానగరములో మతసమస్యా పరిష్కారమునకు వర్తింపజేయబడిన అహింస నిస్సంశయముగా జయప్రదమయ్యెనని యిప్పుడే చెప్పవలనుపడదు. ఇదివరకే నేను చెప్పియుండినట్లు రెండు మతములవారికి సఖ్యభావ మేర్పడుట అద్భుతము. ఇది విచిత్ర పరిస్థితులు అనుకూలముగా నుండెను. షహీద్ సాహెబు, నేను రంగముమీదికి వచ్చి ఉభయమతములవారికి పత్యర్థ నేర్పరిచిన కీర్తి పొందితిమి. ఏది యెట్లున్నను అహింసాసిద్ధాంత ప్రయోగము విషయమై యిప్పుడే జోస్యము చెప్ప వీలులేదు. మొదటిదేమనగా, భాగస్వాములమగు మేమిద్దరము, (సుహ్రవర్దీ గారు మహాత్ముడు) ఏకమనస్కులమై యున్నాము. అహింసలో నమ్మకముగల వారమై యున్నాము. ఇట్లగుటచేత శాస్త్రమును, దాని ప్రయోగమును మేమెరిగియున్న యెడల అహింసాధర్మము తప్పక విజయము గాంచును." (అ. ప్రె)

## ఎ. ఐ. సి. సి. ప్రతినిధుల వసతులు

### బొంబై రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

బొంబాయి, సెప్టెంబర్ 6: బొంబాయిలో సెప్టెంబరు 27, 28 తేదీల్లో జరగబోయే అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశానికి వచ్చే ప్రతినిధుల సౌకర్యాల విషయమై, బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు ఎస్. కె. పాటిల్ ఈ విధంగా ప్రకటిస్తున్నాడు: ఈ విషయమై మాకు అనేక ఉత్తరాలు వస్తున్నవి. ఈసమావేశానికి ఎ. ఐ. సి. సి. సభ్యులను, కొందరు పత్రికావిలేఖరులను మాత్రమే రానివ్వమని కాంగ్రెస్ అధ్యక్షుడు ఉత్తరువుచేశాడు. ఎ. ఐ. సి. సి. సభ్యులందరికీ, ఆహ్వానాలు తెలిపినంతవరకూ, ఆహ్వానాలు పంపించాము. ఆహ్వానాలు చేరనివారు దీనినే ఆహ్వానంగా పరిగణించాలి. వచ్చే సభ్యులంతా తమరాకను ముందుగా 'కాంగ్రెసుహౌస్, బొంబాయి 4' చిరునామాకు తెలియజేయాలి. టెలిగ్రాఫిక్ అడ్రెస్:- కాంగ్రెస్, బొంబాయి."

సమావేశం 27, 28 తేదీల్లో సర్ కౌవాస్జీ జహాంగీర్ హాల్లో (ఫోర్టు, బొంబాయి) జరుగుతుంది.

## తమిళ నాయకుల ప్రచారం

### నగరతమిళ విద్యార్థుల సమావేశము

చెన్నపురి, సెప్టెంబరు 6: "భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకే మేమందరమూ కోరుచున్నదే. మనమూ తమిళ రాష్ట్రమును కోరుచున్నాము. రాజ్యాంగ పరిషత్తు భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకై తన ఒప్పుదల నిచ్చినది. ఐననూ మనము మన రాష్ట్ర నిర్మాణమునకు ఇప్పుడు ఆందోళన చేయరాదు. తిరుపతినుంచి కన్యాకుమారి అగ్రము వరకు మనదే. కొందరాంధ్రులు—శ్రీ ప్రకాశంతో సహా—బాధ్యతలేని ఉపన్యాసములు, చేయుటనాడు అతివిచారకరముగానున్నది. వీరు మద్రాసుకూడా మాదే అంటున్నారు. ... కన్యాకుమారి అగ్రం మాదే అంటున్నారు. ... నిన్నే సమూలము ... తమిళులం పహనముతో ఉండవలెను." అని మద్రాసు వర్తకశాఖామంత్రి డా॥ పి. సుబ్బరాయన్‌గారు మద్రాసుకాలేజీల విద్యార్థుల సమావేశమును ప్రారంభించుచూ చెప్పిరి. శ్రీ చిదంబరం ... మత్స్య విద్యార్థులు పలికసమావేశ ప్రమితి మేరీ మాసిలామణిగారు జాతీయపతాకమును ఎగుర వేసిరి.

శ్రీ టి. పి. మీనాక్షీసుందరంపిళ్లైగారు మాట్లాడుచూ, రాజకీయమైన సమస్యలవలన అనవసరమైన చిక్కు లేర్పడుచున్నవి. కొందరు నాయకులు ఆహారధాన్యములను దాచుకొనమని కూడా ప్రోత్సహించుచున్నారు. రాజకీయ కుట్రలు ఎక్కువైనవి. దీనికి ప్రత్యేకరాష్ట్రము లేకుండుట కూడా ఒక కారణమే. మనమూ ఆంధ్రులు వెంటనే స్నేహితులవలె విడిపడవలెను. అనిరి.

శ్రీ కామరాజనాడారు గారు ప్రసంగించుచూ మద్రాసు తమదే ననిరి. "తమిళరాష్ట్రము కొరకు మనము ఆందోళన చెయ్యనక్కరలేదు. అదివిధిగా వచ్చును. మన భాషారాష్ట్రములో ఎవ్వరి హక్కులను హరించము. ఇష్టము ఉన్నవారు మనతో కలిసి ఉండవచ్చుననిరి.

శ్రీ శివజ్ఞాన గ్రామణిగారు కూడా మాట్లాడిరి.

## గంటలను తెలుపుటకు తుపాకి ప్రేల్పులు

చెన్నపురి, సెప్టెంబరు 6: చెన్నపురపాలక సంఘము వారు కాలమును సూచించుటకు తుపాకులు పేల్చవలసినదని అనగా ఎన్నిగంటలయినదో అన్ని గుండ్లు వేయుమని-ప్రభుత్వమును కోరిరి. కావలసిన సామానులు లభ్యము కానందున ఇంకను ఆపనికి ప్రభుత్వము పూనుకొనలేదు. ప్రభుత్వము అవి లభించినంతనే ప్రారంభింప నున్నదని ఆంధ్ర వాణిజ్య సంఘ కార్యదర్శి తెలుపుచున్నారు.

## చూళై ఆది ఆంధ్రుల దుర్భర జీవితస్థితి

చెన్నపురి, సెప్టెంబరు 6: "చూళై ఆది ఆంధ్రుల నివాసములు దుర్గంధములో మునిగిపోయినవి. వాతావరణము ఆ యొ కార్పొరేషన్ యొక్క అశ్రద్ధచే, మలినమైపోయినది. ఇచటి హరిజనులు అతి హీనస్థితిలో ఉన్నారు. ఇక్కడ ఎక్కువమంది ఆంధ్రులే అయినను ఒక్క వీధి పేరును తెనుగులో లేదు అని చూళై ఆది ఆంధ్ర యువజనసంఘ కార్యదర్శి శ్రీ రాఘవలుగారు నేటి సాయంత్రము జరిగిన ఆది ఆంధ్ర సమావేశములో చెప్పిరి. శ్రీ చింతకుంట రాఘవరావుగారు అధ్యక్షత వహించిరి. బాలబాలికలు ప్రార్థన పాడిన తదుపరి శ్రీ రాఘవరావుగారు నేటినుండి వరకు పరిశుభ్రముగానుండవలెనని హరిజనుల కున్నోపించిరి. మద్రాసు కార్పొరేషన్ వారు ఇంత అపరిశుభ్రముగా ఈ ప్రదేశమును, ఈజనులను, ఎట్లు ఉండనిచ్చిరని కారణము అగుచున్నది. తమ పోటీవారు ఎందరు విరోధము తెచ్చినను ప్రభుత్వము పూనుకొన్నంత బలీయము కాదు; కాన వెంటనే ఆదిఆంధ్రులు ప్రభుత్వమునకు విన్నవించుకొనుట ద్వారాను, తమ స్వయంకృషి ద్వారాను తమ ఆరోగ్యమును, తమ పిల్లల ఆరోగ్యమును అభివృద్ధిచేసుకొనుటకు ప్రయత్నించవలెననిరి.

బుధవారం రైతులమహాసభ యీ నెల 10న గుడివాడ గారిశంకర సినిమా హాలులో జరుగును.

## సంపాదక లేఖలు

### రేషన్ ఇబ్బంది

ఆర్యా!

గుంటూరు జిల్లా మెట్ట ప్రాంతమయిన పెదకాకాని పరిసరంలో ఇక్ పార్శ్వ ల రేషనింగు అమలులో నున్నది. రేషన్ డిపోలలో రెండు వారములనుండి బియ్యం లేవు. బయటనుండి తెచ్చుకొనుటకు రేషన్ నిబంధనలు అడ్డుపడుచున్నాయి. ప్రజలు ఆకలితో మాడిపోతున్నారు. ప్రభుత్వం తగిన చర్యను వెంటనే తీసుకోవాలని కోరుతున్నాను. ఇట్లు

కాటాబత్తుని మార్కండేయులు.

### దసరాపండుగ సెలవులు

ఆర్యా,

ప్రభుత్వవిద్యాలయములకు ఈ నెలలో "మైకేల్‌మస్" పండుగకు రెండు వారములు సెలవులిచ్చి, జాతీయ దసరాపండుగలకు సెలవులుతగ్గించి చేశారు. "మైకేల్‌మస్" సెలవులను ప్రభుత్వము వెంటనే రద్దుచేసి, దసరా పూజాదినములకు రెండు వారములు సెలవు వచ్చునట్లు ఏర్పాటు చేయవలసినదిగా కోరుచున్నాను.

ఇట్లు,
వి. సీతారామశాస్త్రి.

* * *

### ఆంధ్రరాష్ట్రంగూర్చి శరత్‌బోసు పట్టుదల

ఆర్యా!

శ్రీ శరచ్చంద్ర బోసు గారు కలకత్తానుంచి నాకు వ్రాయుచు భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన విషయమై తాము ప్రస్తుతము ఢిల్లీకి పోవలచుకోలేదనియు, జనేయెడల అఖిల భారత భాషా ప్రయుక్త రాష్ట్ర సమితి కార్యదర్శులతో చర్చించి భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్ణయము త్వరలో సిద్ధించు విషయమై చేయు ప్రయత్నములకు తోడ్పడెదనని తెలియపరచిరి. ప్రస్తుతము అఖిల భారత రాష్ట్ర సమితి తలపెట్టిన కార్యక్రమము, ఉద్యమము నిర్వహించుట అవసరమైనదనియు, కాంగ్రెసువారే భాషారాష్ట్రము నంగీకరించినందున, కాన్స్టిట్యుయంటు ఎసెంబ్లీ సభ్యులకు ఈ సమస్య పరిష్కరింపక ఎల్లకాలము గడపుట సాధ్యము కాదనియు వ్రాసిరి.

శ్రీ శరచ్చంద్ర బోసుగారి అభిప్రాయమును పరికించిన యెడల ఈ సమస్యా పరిష్కారమును, ఆయన ఎంత ఉత్కృష్టముగా నెంచుచున్నదియు, తెల్లముగా గలదు. ఢిల్లీలో ఈ మాటే అందరికి కంటకముగా నున్నట్లున్నది. మన తెలుగువారు ఈ విషయమై యింకా ఉపేక్షా భావము మానుట భావ్యము కాదని విన్నవించుచున్నాను. కర్ణాటక మహామండలి (బొంబాయి) వారు భాషా ప్రయుక్త రాష్ట్రముల విభజనచేయుటకై వారిసభ్యులచే రాజీనామా నిప్పించెదమని పరిషత్తు అధ్యక్షులకు, శ్రీ వల్లభాయి జవహర్లాలు గారికి తమ ఉద్దేశ్యమును తెలియచేసిరి.

బెంగాలీవారుకూడ ఆందోళన చేయుచున్నారు. మహారాష్ట్రులుకూడ తమకు ఉద్యమము కొనసాగుచునే ఉన్నది.

అన్ని విధములాంధ్రులే, కేంద్రప్రభుత్వమునందును ఇతర ప్రదేశములందును స్థానములేక ఇతరులపై ఆధారపడవలసి వచ్చుచున్నది. ఈ హీనస్థితిని మాన్పుకొనుటకు మన రాష్ట్రము మనము సంపాదింపవలసియుండును. మన సభ్యులు, ఈ సమస్య పరిష్కరించిన గాని ఇకముందు రాజ్యాంగ పరిషత్తుతో మాకు సంబంధం లేదని తీర్మానించుకొనుట ముఖ్యమని మనవిచేయుచున్నాను.

నల్లాన్ చక్రవర్తి నరసింహాచార్య.

## నరాలు: అపాయపు గుర్తు

నరాలు బిగపట్టితే అజీర్ణవ్యాధి, ఇంకా ఆ సంబంధమైన ఇతరవ్యాధులు కలుగుతవి. నీరసించిన నరాలకు అదర్శనుగు టానిక్ అయిన విగోరా సేవనతో నరముల నుపశమింపజేసి మంచి ఆరోగ్యము పొందుటకు మార్గాన్ని పరిశీలించుకొనండి.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras

# ధాన్యసేకరణ: మంత్రుల పర్యటన

## చంద్రమౌళిగారిచే 4 వేల బస్తాల వసూలు

తెనాలి, సెప్టెంబరు 6: స్థానిక సంస్థల మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు మొన్న ఇక్కడికి వచ్చిరి. కలెక్టరు, డిప్యూటీ కలెక్టరు, తాలూకా సప్లయి ఆఫీసరు, సర్కిలు ఇన్‌స్పెక్టరు, తహసీల్దారు, మంతెన వెంకటరాజు (యం. యల్. ఏ.) మున్నగువారు స్టేషనులో కలిసికొని వారికి స్వాగతమిచ్చిరి. 4 తేదీ ఉదయం చంద్రమౌళిగారు చావలిగ్రామం వెళ్ళిరి. ఆ గ్రామస్థుల తరఫున 500 బస్తాల ధాన్యం యిచ్చుటకు వాగ్దానము చేసిరి. అచటినుండి పెదవలి గ్రామము వెళ్ళిరి. ఈ గ్రామం తరఫున 350 బస్తాల ధాన్యం సమర్పించిరి. అచటినుండి పెరవలిపాలెమునకు వెళ్లగా ఆగ్రామం తరఫున 200 బస్తాల ధాన్యమున్నూ, రంగనాయకులుగారు 600 బస్తాల ధాన్యమును సమర్పించిరి. అచటినుండి వేమూరు గ్రామము వెళ్లగా, ఆగ్రామం తరఫున 200 బస్తాలధాన్యం సమర్పించారు. ఆటు పిమ్మట అనంతవరంవారు 400 బస్తాల ధాన్యమిచ్చిరి. 400 తర్వాత కొల్లూరులో అంకినీడుగారు 900 బస్తాల ధాన్యమును, నన్నపనేని సీతారామయ్యగారు 100 బస్తాల ధాన్యమును, రామచంద్ర రైసుమిల్లు 800 బస్తాల ధాన్యమును సమర్పించిరి.

పిమ్మట దోనేపూడి విచ్చేయగా అచట గ్రామం తరఫున 200 బస్తాలధాన్యం సమర్పించిరి. మంత్రిగారు ప్రతి గ్రామములోను బహిరంగసభలలో ఉపన్యసిస్తూ తామ కరవుబాధితుల కొరకై భిక్షార్థులై వచ్చితినని చెప్పిరి.

## సీతారామరెడ్డిగారి పర్యటన

### 5,000 బస్తాల ధాన్యం వసూలు

మదనపల్లి, సెప్టెంబరు 6: పరిశ్రమల మంత్రి హెచ్. సీతారామరెడ్డిగారు నిన్న రాత్రి మదనపల్లిలో సమావేశమైన ఉత్పత్తిదార్ల సమావేశంలో ఉపన్యసించిరి. అందుకు ఫలితంగా 5,000 బస్తాల ధాన్యమును సేకరించి యిస్తామని సభలోని ఉత్పత్తిదార్లు వాగ్దానం చేసిరి. మంత్రిగారును శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారును నిన్న రాత్రి యిక్కడికి విచ్చేసిరి. రేపుదయం అనంతపురము వెళ్ళిరి. ఈ సభకు రావలెనని పత్రికావిలేఖరులకు ఆహ్వానం పంపలేదు.

## కళా వెంకటరావుగారి పర్యటన

నెల్లూరు, సెప్టెంబరు 5: రెవిన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు నిన్న ఇక్కడికి వచ్చిరి. సాయంకాలము పురమందిరమున జరిగిన రైతుమహాసభలో 1½ గంటసేపు ఉపన్యసించిరి. రైతులు తమవద్ద మిగిలియున్న ధాన్యమును క్షామనివారణకై యివ్వవలయునని చెప్పిరి. ధాన్యసేకరణ విషయములో ప్రభుత్వోద్యోగులు దౌర్జన్యము ఎవరిపట్లను చూపరు అనిరి. జమీందారీబిల్లు యీనెల 10 తేదీని మంత్రివర్గసమావేశములో చర్చింపబడును. 13 తేదీని పత్రికావిలేఖరుల గోష్ఠిలో వివరింపబడును. 14 తేదీ పార్టీ మీటింగులో బిల్లు నివేదింపబడును అని చెప్పిరి. మంత్రిగారికి జమీను రైతులు ఇనాందార్లు శ్రోత్రియందార్లు వినతిపత్రములు సమర్పించిరి. నెల్లూరు జిల్లా రాజకీయ బాధితులసభ ట్రావెలర్సు బంగాళాలో జరిగినది. రాజకీయబాధితులకు ఆయుధేతర యకరములు భూమి యిచ్చుటను గూర్చి చర్చించిరి. రాజకీయ బాధితులు కొందరు కీర్తిశేషులై యున్నారు. వారి కుటుంబములకు గూడ యీ భూదానము వర్తించునని మంత్రిగారు చెప్పిరి.

యానాదులు సమర్పించిన వినతిపత్రమును స్వీకరించిరి. హరిజనులతోబాటు యానాదులకుకూడ ప్రభుత్వ సహాయము లభించునట్లుగా ఏర్పాట్లు త్వరలో చేయుగలనని వాగ్దానం చేసిరి.

రాజకీయ బాధితుల కొరకైన భూదానముల విషయములో ముగ్గురు అనధికారులుగల కమిటీ ఏర్పాటు చేయబడుననియు, వారి నిర్ణయములపై అపీలును ప్రభుత్వమునకే చేయవలెననియు ప్రభుత్వ నిర్ణయమే అంతిమ నిర్ణయమనియు వెంకట్రావుగారు చెప్పిరి.

ఆంధ్రరాష్ట్రము త్వరలో తప్పక స్థాపించబడుననియు తన రాజ్యాంగములో ఆంధ్రరాష్ట్రము ఏర్పడుటకు అవకాశము లేనిచో మంత్రిపదవికి రాజీనామా ఇచ్చి, ఆంధ్రోద్యమమునకు పాటుపడెదననియు మంత్రిగారు చెప్పిరి.

ఆటుపిమ్మట కస్తూరిదేవి బాలికాపాఠశాల సహాయార్థమై ఏర్పాటుచేయబడిన భరతనాట్య ప్రారంభోత్సవము జరిపి రాత్రి రైలులో తెనాలికి పయనమైరి.

## కూర్మయ్యగారి పర్యటన

అవనిగడ్డ, సెప్టెంబరు 6: మంత్రి కూర్మయ్యగారు దివితాలూకాలోని చల్లపల్లి, పెదకళ్లేపల్లి, పెదప్రోలు, కొడాలి, నాగాయలంక, ఘంటసాల గ్రామములను ధాన్యసేకరణకై పర్యటనము చేసిరి. ఈ గ్రామాలలో సుమారు 60 వేల బస్తాల ధాన్యమును యిస్తామని గ్రామవాసులు వాగ్దానములు చేసిరి.

దివిసీమ ప్రథమ ఆదిఆంధ్ర మహాసభకు కూర్మయ్యగారు హాజరైరి.

నాగాయలంక బోర్డు హైస్కూలుకు జిల్లా కలెక్టరు శంకుస్థాపన చేసెను.

నాగాయలంకలో జిల్లాకలెక్టరు, రేషనింగు ఆఫీసరు, తాలూకా తహసీల్దారు కలిసి యింటింటికి వెళ్లి ధాన్యసేకరణ విరివిగా చేసిరి.

## రుద్రవరం భూములు: హరిజనుల అక్రమాక్రమణ

కర్నూలు, సెప్టెంబరు 6: కర్నూలు జిల్లాలోని రుద్రవరము గ్రామములో మాజీ సైనికుల కొరకై ఏర్పడిన వ్యవసాయ భూములలో ఆపరేటివు సొసైటి తాలూకు పొలములందు పైరు చాలా లేత స్థితిలో ఉన్నది. జోహరాపురంలోని హరిజనులు కొందరు వచ్చి యీ లేత పైరును నాశనము చేసి ధిక్కారంగా ఆ పొలములందు తిరిగి విత్తనములు జల్లుకొనుచున్నారు.

పడిదపాడు గ్రామస్థులు కొందరు ఇదివరలో శివాయజమా భూములను (పరాకు బంజరును) సాగుచేయుచుండిరి. వారు ఇప్పుడు పైచెప్పిన కో-ఆపరేటివు సొసైటీ తాలూకు భూములలోని వ్యవసాయమును ఆటంక పరచుచున్నారు. ఇందువల్ల విత్తనాలు జల్లుటకూడ ఆగిపోయింది. మాజీ సైనికుల భూవసతుల రీసెటిల్మెంటు వ్యవహారములలో జిల్లా కలెక్టరు గారి స్పెషల్ అసిస్టెంటు ఆఫీసరుకు పై విషయము ఫిర్యాదు చేయబడెను.

అందువల్ల రుద్రవరము చుట్టుప్రక్క గ్రామాలలోని వారు యీ మాజీ సైనిక వలస భూములలో ప్రవేశించి ఎట్టి ఆటంకములను కలుగకుండా నివారించుటకై కర్నూలు సబు మేజిస్ట్రేటు గారు ఈ గ్రామములలో 144 సెక్షను రెండు మాసాల వరకూ అమలు జరుపవలసినదని ఉత్తరువు జారీచేసినారు.

## కొల్లేరుముంపువల్ల కలిగిన నష్టం

భీమవరం, సెప్టెంబరు 4: కొల్లేరు ముంపు విచారణ సభ శ్రీ ముల్లారెడ్డి వేంకటగిరిరావు గారి అధ్యక్షతను నిన్న ఆకివీడులో జరిగింది. తాలూకా రైతు కాంగ్రెస్ అధ్యక్షుడు గోకరాజు శ్రీరామరాజు, గొట్టుముక్కల రామచంద్రరావుగార్లు ఉపన్యసించారు. ఇటీవల కురిసిన విపరీత వర్షముచే ఆకివీడులో 1000 యకరాలు, మాదివాడలో 400 య, ఏలూరుపాడులో 300 య, జువ్వలపాలెంలో 100 య, చెరుకుమిల్లిలో 100 య, అయిభీమవరంలో 100 య, గుంకలగడపలో 400 య, సిద్ధాపురంలో 1000 య, ధర్మాపురంలో 700 య, కోళ్ళపర్రులో 800 య, కుమ్మరలూరులో 500 య, తరటావలో 50 య, చినకాపవరంలో 500 య, పెదకాపవరంలో 600 య, గొవ్వాడలో 400 య, బాదాయపాలెంలో 800 య, ఆకివీడు ఫిర్కా మొత్తం మీద సుమారు 7000 య. పంట నష్టమైపోయింది. నష్టము సుమారు 4 లక్షల రూపాయలుండునని అంచనా వేయబడినది అని వారు తెలిపారు. ఈ విషయం మంత్రులకు, అధికారులకు మెమొరాండముల ద్వారా తెలియజేయుటకు గోకరాజు శ్రీరామరాజు, గొట్టుముక్కల రామచంద్రరావు, దోసా విష్ణు నారాయణ మూర్తిగార్లతో కూడిన ఒక సంఘం ఏర్పాటుచేయడానికి సభలో తీర్మానించారు. (స్వ. వి.)

### వద్దిపర్రు గ్రామములో పంట నష్టము

వద్దిపర్రు, సెప్టెంబరు 2: నరసాపురం తాలూకా వద్దిపర్రు గ్రామములో, ఈమధ్య కురిసిన వర్షమువలన చేలు పూర్తిగా మునిగి పోయినవి. పది రోజుల నుండి మొక్కలు నీటిలో మునిగి ఉండుటచే పంట కుళ్ళిపోయినది. నీటిముంపు ఇంకా తగ్గలేదు.

### చిత్తూరు జిల్లా నుంచి బెల్లం ఎగుమతులు

చెన్నపురి, సెప్టెంబరు 6: శ్రీటి. కె. టి యస్. ఆర్. తాతాచారి కె. నాథముని రెడ్డి గారలు రైతులతరఫు ప్రభుత్వమునకు వ్రాసిన ఫలితముగా జిల్లానుండి ఎగుమతులు 100 కి 37½ వంతులు ఉత్పత్తిదార్లు, 37½ వంతులు వర్తకులు చేసుకొనవచ్చుననియు ప్రభుత్వమువారు ఉత్తర్వు చేసిరి. జిల్లాలో బెల్లం ఉత్పత్తి హెచ్చయినందున జిల్లానుంచి ఎగుమతులు హెచ్చు చేయుటకు అనుమతి నివ్వవలసిందిగా మద్రాసు ప్రభుత్వమువారు భారత ప్రభుత్వమును కోరనున్నారని తెలియుచున్నది.

### దీనబంధు

నెల్లూరు, సెప్టెంబరు 4: శ్రీ పి. గోపాలకృష్ణారెడ్డిగారు 'దీనబంధు' వారపత్రిక సంపాదకుడుగా, పబ్లిషరుగా, స్థానిక మేజిస్ట్రేటువద్ద డిక్లరేషన్ పొందారు.







